# పీఠిక



ఈ స్తోత్రము శివమహిమ్నస్తోత్రము. ఇది శివుని మహిమయొక్క స్తోత్రము. ఇదిస్తోత్రములలో ప్రాచుర్యముగను ప్రాముఖ్యముగను నుండుటచేతను, శివునియం దేకదేశవర్తిత్వముగ నుండుటచేతను, ఈ నామమందలి శివశబ్దమును విడిచి మహిమ్నస్తోత్రము అనియే పెద్దలు వాడుచుండిరి. ఇందలి మహిమ్నశబ్దము సంస్కృతవిభక్త్యంతమై యున్నను ఈ నామము పండితపామరులకుఁ బరిపాటిగనుండుటచే నాంధ్రీకరణమందును దీనినే స్వీకరించుట కలిగినది. ఈ స్తోత్రమును సంస్కృతభాషలో నేను బలుమారు పఠింపఁగాఁ గలిగిన యానందము నన్నీ గ్రంథకరణమునకుఁ బురకొల్పినది. మత్కవిత్వశక్తి యెట్టులున్నను, పండితులిందలి విషయమునే గ్రహించి కవి సామాన్యుఁడైనను భక్తియుక్తుఁ డని సైరింతురుగాక.

మచిలీబందరు,
8-2-10.

వేతపూడి లక్ష్మీకాంతము.



# మహిమ్నస్తోత్రము




1 అవతారిక.—శివభక్తుఁడైన పుష్పదంతాచార్యుఁడు తాఁనీ స్తోత్రమును జేయుట [illegible] కాఁదని సమర్థించుకొనుచున్నాఁడు.

శ్లో॥ మహిమ్నః పారం తే పర మవిదుషో యద్య
సదృశీ।స్తుతి ర్బ్రహ్మాదీనామపి తదవసన్నా స్త్వయి
గిరః।అథా వాచ్య స్సర్వ స్స్వమతి పరిణామావధిగృణన్।
మమా ప్యేష స్తోత్రే హర! నిరపవాదః పరికరః॥

ఉ॥ శ్రీకరమైన నీ మహిమసీమ నెఱుంగని
వారి సన్నుతుల్। స్తోకములైనచో, జలజ
సూతిముఖామరసంస్తవంబు ల।ట్లే కద, కాన
ధీకొలఁది నెవ్వఁడు నైన నుతింప నొప్పుచో।
నీకరణి న్నుతించెద మహేశ్వర!మత్కృతి
దోష ముండునే?

తాత్పర్యము: ఓ శివా! నీ మహిమయొక్క యంతమును తెలుసుకొనుట యశక్యమని బ్రహ్మాదులే వచింపుచుందురు. తమ శక్తికొలఁది నుతించి సఫలమనోరథులైరి. కావున యథాశక్తిగా నేను నుతింపఁ బూనుటయు నింద్యము కాదని తాత్పర్యము.

2. అ॥ ఈశ్వరునియొక్క సగుణస్వరూపమే తన స్తోత్రమునకు విషయమని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ అతీతః పంథానం తవ చ మహిమా వాఙ్మనసయోః। అతద్వ్యావృత్త్యా యం చకితమభిధత్తే శ్రుతిరపి। స కస్య స్తోతవ్యః కతివిధగుణః కస్య విషయః। పదే త్వర్వాచీనే పతతి న మనః కస్య న వచః॥

ఉ॥ వాక్కునకు న్మనంబునకు నవశ్యము నీ మహిమంబు; దాని నీ। ఫక్కిది యంచు వేదములె వల్కఁగ నోడు; గుణాన్వితంబెటా?। నెక్కరణి న్నుతింప సగుణి నెవ్వనికా విష

యంబు? కావునన్ వాక్కుమనంబు లెవ్వ
నివి వర్తిల వీశ! భవద్గుణాకృతిన్?

తా॥ ఓయీశ్వరా! నీ మహిమ యవాఙ్మానసగోచర మగుటంజేసి వేదములే నీ మహిమ నదికాపడకావని భయపడుచుఁ బల్కుచున్నవి. అట్టి మహిమయొక్క గుణము లేవో, యవెట్లు స్తోత్రార్హమో, యెవ్వనికి విషయమో, యూహింప శక్యము గాకున్నది. కావున నీయొక్క సగుణస్వరూపమే స్తోత్రమునకును ధ్యానమునకును స్థానమైయున్నది.

3. అ॥ తన స్తోత్రముయొక్క ప్రయోజనమును దెలుపుచున్నాఁడు.

శ్లో॥ మధుస్ఫీతావాచః పరమ మమృతం నిర్మితవత
స్తవ బ్రహ్మన్ కిం వాగపి సురగురో ర్విస్మయపదం।
మమ త్వేతాం వాణీం గుణకథనపుణ్యేన భవతః
పునామీత్యర్థేఽస్మిన్ పురమథన! బుద్ధి ర్వ్యవసితా॥

ఉ॥ తియ్యనిమాటలన్ సుధ సతోవాడు

రంబుగఁ గూర్చునట్టి మా। యయ్యా! బృహ
స్పతిస్తుతియు నద్భుత మెట్లగు నీకు? నాదు
ధీ। యియ్యకొనుగ భవత్కథల నేర్పడఁ
బల్కెడు పుణ్యరాశిచే। న్యాయ్యముగా
మదీయరసన న్విమలం బొనరింప శంకరా!॥

తా॥ ఓ దేవా! యమృతవాక్కులుగల నీకు బృహ
స్పతియుంతవాని స్తవమైన నద్భుతకరంబుగ నుండునా?
ఉండదు. కావున నా స్తవముగ నిన్ను సంతోషపెట్టలే
కున్నను నీ మహిమను గురించి నడువుటవలనఁ గలుగు
పుణ్యముచే నా వాక్కును బరిశుద్ధము చేసికొనుటయే
నా సంకల్పము.

4. అ॥ ఈశ్వరమహిమను నిందించువారిని
భక్తుఁ డాక్షేపించుచున్నాఁడు.

శ్లో॥ తవైశ్వర్యం యత్త జ్జగదుదయరక్షాప్రళ
యకృ। త్త్రయీవస్తు వ్యస్తం తిసృషు గుణభిన్నాసు
తనుషు। అభవ్యానా మస్మి న్వరద రమణీయా మర

మణీం। విహంతుం వ్యాక్రోశం విదధత ఇ హైకే జడ
ధియః॥

ఉ॥ ఏయది లోకజాలము సృజించునో, పెంచునో, గీటడంచునో। యేయది వేద భోధ్య మగు, నేయది భేదగుణత్రయాంగ సం। స్థాయిగ నుండి వ్యస్తమగుఁ, దన్మహిమంబు జడాత్ములట్టి యే। మో యవ వాదలాడెద రహో! బుధకోటి కసమ్మతంబుగన్॥

తా॥ జగత్తుయొక్క సృష్టిస్థితిసంహారములను జేయుటకు సత్వరజస్తమోగుణప్రధానములైన బ్రహ్మవిష్ణురుద్ర రూపములను ప్రత్యేకముగ ధరించిన నీ మహామహిమను మూఢులు కొందఱు నిందచేయుదురు. సజ్జనుల కా నింద యసహ్యముగ నుండును.

6. అ॥ ఆ నిందను వివరించుచున్నాఁడు—

శ్లో॥ కిమీహః కింకాయ స్స ఖలు కి ముపాయ

త్రిభువనం కిమాధారో ధాతా సృజతి కిముపాదాన ఇతి చ। అతర్క్యైశ్వర్యే త్వయ్యనవసరదుస్థో హతధియః। కుతర్కోఽయం కాంశ్చిన్ముఖరయతి మోహాయ జగతామ్॥

శా॥ కాయంబుం గరణం బుపాయమును సంకల్పంబు నాధార మో। హో యాధాతకు నేవి? సృష్టికరణోద్యోగార్థమంచున్ దురూ। హాయత్తాత్ముఁడు వక్కుఁడున్ జనుల మోహభ్రాంతులం జేయుచున్। నీ యైశ్వర్య మతర్క్యమై విపులమై నిండారి శోభిల్లఁగన్॥

తా॥ లోకసృష్టి చేయుటకొఱకు బ్రహ్మకు శరీరమును, సంకల్పమును, ఉపాయమును, సామగ్రియు, నాధారమును నేవి యని యా దురాత్ములు తర్కించుచున్నారు. నీ యైశ్వర్య మూహింప శక్యముగానిదై యుండఁగా వా రట్లు కుతర్కము చేయుట జనులను భ్రమపెట్టుటకే.

6. అ॥ జగత్తుల కీశ్వరుఁడే కర్త యని భక్తుఁడు నిరూపించుచున్నాఁడు.

శ్లో॥ అజన్మానో లోకాః కిమవయవవన్తోఽపి జగ
తా మధిష్ఠాతారం కిం భవవిధి రనాదృత్య భవతి। అ
నీశో వా కుర్యా ద్భువనజననే కః పరికరో। యతో
మందా స్త్వాంప్ర త్యమరవర! సంశేరత ఇమే॥

ఉ॥ మూర్తములయిన లోకములు పుట్టుక
లేనివె? పుట్టి యున్నచోఁ గర్తను గోర
కుండునె? జగంబుల నీశుఁడు కానివాఁడు
తా వర్తిలఁ జేయ దక్షుఁడే? శివా! జగ
దాళికి నీవు కర్తవై। పూర్తిగఁ దేజరిల్ల
జడబుద్ధులు సంశయ మంద నేలొకో॥

తా॥ ఈ సచరాచరలోకము లవయవములు గలవియై
కర్త లేకుండ జనింపఁ జాలవు. అట్టికర్త యీశ్వ
రుఁడే. ఈశ్వరుఁడు కానివాఁ డా సృష్టినిఁ జేయఁ
జాలఁడు. కాఁబట్టి మందబుద్ధులు నీ కర్తృత్వము
నేల శంకింతురో తెలియదు.

7. అ॥ భిన్నమార్గములుగల మతసిద్ధాంతము

లన్నియు నీశ్వరుని యందే పర్యవసానమును బొంద
చున్న వని ప్రతిపాదించుచున్నాఁడు.

శ్లో॥ త్రయీ, సాంఖ్యం, యోగః, పశుపతి మతం, వైష్ణవ, మితి। ప్రభిన్నే ప్రస్థానే పర మిద మదః ప థ్య మితిచ। రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిల నానాప థజుషాం। నృణా మేకో గమ్య స్త్వ మసి పయసా మర్ణవ ఇవ॥

ఉ॥ వైదిక, సాంఖ్య, యోగ, పరవైష్ణవ,
పాశుపతా ఖ్యలై భువిఁ। భేదగతిఁ మతం
బులు సువిస్తరయుక్తుల స్వస్వముఖ్యతా।
పాదనఁ జేసి, చిత్రరుచిభంగి వినోదిజనాళి
కిం దుర్దఁ। నీ దరిఁ జేరు వాహినులు నీ
రధిఁ జేరెడురీతి నమ్మెయిఁ॥

తా॥ వేదత్రయమును, సాంఖ్యమతమును, యోగ మతమును, పశుపతిమత మనఁగా శైవాగమంబును, వైష్ణవ మనఁగా పాంచరాత్రాగమమును, నివి యో

దేవా! భిన్నమార్గములుగలవై ఋజుమార్గపరులును గుటిలమార్గాసక్తులును నగు జనులకు స్వోత్కృష్టను బరికటించుచుఁ దుదకు ఋజుకుటిల మార్గములుగల నదులన్నియు సముద్రములో గలియునట్లు, నీయందే పర్యవసానము పొందుచున్నవి.

8. అ॥ శివుని వైరాగ్య వేషము సార్థక మైనదని నిరూపించుచున్నాఁడు.

శ్లో॥ మహోక్షః, ఖట్వాంగం, పరశు, రజినం, భస్మ, ఫణినః,। కపాలం, చేతీయ త్తవ వరద! తంత్రోపకరణం। సురా స్తాం తా మృద్ధిం దధతితు భవద్భ్రూప్రణిహితాం। నహి స్వాత్మారామం విషయమృగతృష్ణా భ్రమయతి॥

మ॥ ఘనఖట్వాంగము, నందియుం, బరశువుం, గాపాలమాలల్ మహా।జినముల్, భోగులు, భస్మముల్; భువనరాజిం బ్రోవఁగా నీ కివా। ధనముల్ నీ కరుణాకటాక్షవిభ

ప్రాత్యోన్మాంబుఁ దాల్చన్ సుశీల! పరఁగోఁ
దాను రమించువాఁడు విషయాద్ధత్వంబు
బాటించునే.॥

తా. ఓ సర్వేశ్వరుఁడా! శ్రేష్ఠమైన యెద్దును, దండముయొక్క పైనుండెడు బ్రహ్మకపాలమును, గండ్రగొడ్డలియు, చర్మమును, భస్మమును, సర్పములును, ప్రపంచపరిపాలనకొఱకు నీకు సాధనములై యున్నవే కాని నీ కాభరణములు కావు. నీవు పేదగాఁ గన్పట్టినను నీ కృపాకటాక్షములవలనఁ గలిగిన యైశ్వర్యముచే సుర లనుభవించుచున్నారు. నీ వట్లుండుటకుఁ గారణమేమనిన నాత్మారాముఁడవై నీవు తుచ్ఛమును నశ్వరమును నగునట్టి యీ యైశ్వర్యమును గోరవు.

9. అ॥ జగత్తుయొక్క నిత్యానిత్యములనుగుఱించి భిన్నమతము లున్నను దన స్తోత్రము బలముగలదియని పలుకుచున్నాఁడు.

శ్లో॥ ధ్రువం కశ్చి త్సర్వం సకల మపర స్త్వ

ధ్రువమిదం పరో ధ్రౌవ్యాధ్రౌవ్యే జగతి గదతి వ్యస్తవిషయే। సమస్తేప్యేతస్మిన్ పురమథన తైర్విస్మిత ఇవ। స్తువన్ జిహ్రేమి త్వాం న ఖలు నను ధృష్టా ముఖరతా॥

చ॥ ఒకఁడు జగంబు నిత్య మను నొక్కఁ డనిత్య
ము నా వచించు వే। రొకఁ డది రెండు నాఁ దొరయ
నొండొకటిన్ విషయంబులం దనన్। సకలము నీవె
యంచు మతి సల్పఁగ నా ఘను లేఁగించి రే! మొఱో య
ని సిగ్గుఁ జెందెద నహో! భవదర్పిత వాక్య మల్పమే?

తా॥ ఓ యీశ్వరా! భాట్టమతావలంబి యగువాఁడు జగత్తు నిత్యమనియు, లోకాలోక బౌద్ధుఁ డది యనిత్య మనియు, లోక క్షపణకుఁ డాకాశాది పంచకము నిత్యమనియు, ఘటపటాదిక మనిత్యమనియుఁ బల్కుచున్నారు. అట్లుపల్కుచున్న వారిచే నపహసింపఁబడ్డవానివలెనే నిన్ను స్తుతింపుచున్న నేను సిగ్గను బొందుచున్నాను. అయినను నిన్ను గుఱించి నేను చేయు స్తోత్రము బలహీన మగునా! కాదనుట.

10 అ॥ మహాలింగావిర్భావమును స్తోత్రము చేయుచున్నాఁడు.

శ్లో॥ తవైశ్వర్యం యత్నా ద్యదుపరి విరించో హరి రథః। పరిచ్ఛేత్తుం యాతా వనలమనిలస్కంధవపుషః। తతో భక్తిశ్రద్ధాభరగురుగృణద్భ్యాం గిరిశ యత్। స్వయం తస్థే తాభ్యాం తవ కి మనువృత్తి ర్నఫలతి.॥

మ॥ అజుఁ డూర్ధ్వంబు నధస్థలంబు హరి నీ వైశ్వర్యపారంబుఁ జూడఁ జనం బావక వాయుదేహ? వృథ యార్తిన్ వార లగ్గించి నిర్భజియింప న్నది హర్షమంది నిజరూప ప్రస్ఫురద్దర్శనం। బుఁ జేలంగన్ వెస నిచ్చితౌ హితఫలంబున్ జెందరే నీ శ్రుతుల్॥

తా॥ ఓ యీశ్వరుఁడా! యగ్నివాయువు శరీరముగాఁగలవాఁడవై యున్న నీ స్వరూపమాహాత్మ్యము బ్రహ్మవిష్ణువులు నిశ్చయించుటకై బ్రహ్మ యూర్ధ్వ

లోకములఁగూర్చియు విష్ణువు పాతాళలోకముఁగూర్చి యు వెడలి నీ స్వరూపమును దెలిసికొనఁజాలక మరలి భక్తిశ్రద్ధాతిశయముచేత నిన్ను స్తుతిసేయఁగా నీ వను గ్రహించి నీ మాహాత్మ్యమును వారలకు బ్రకాశముగాఁ దెలియఁబఱచినావు. కాన నీ సేవ నీ భక్తులకు సమస్త ఫలములను బూర్తిగ నిచ్చునని గ్రహింపఁదగియు న్నది.

11. అ॥ ఈశ్వరసేవ సమస్తఫలదాయక మను సంగతిని దృఢపఱచుచున్నాఁడు. ;

శ్లో॥ అయత్నా దాపాద్య త్రిభువన మవైరవ్యతి
కరం। దశాస్యో యద్బాహా నభృత రణకండూపర
వశాన్। శిరఃపద్మశ్రేణీరచితచరణాంభోరుహబలేః। స్థి
రాయా స్త్వద్భక్తే స్త్రిపురహర విస్ఫూర్జిత మిదం॥

శా॥ ముల్లోకంబు లయత్నతం గెలిచి దం
బుం జెంది పౌలస్త్యుఁడు। ద్యుల్లీలా విహరించి
బాహాచయగాఢాసారకండూతిఁ। శైలంబో

యనువెల్ల నా త్రిశిరముల్ ఛేదించి నే
పూజనం బుల్లంబార నొనర్చియుంటఁ గాన
శంభూ! భక్తచింతామణీ!॥

తా॥ ఓ ఈశ్వరా! రావణుఁడు మూఁడులోకముల ననాయాసముగ జయించి మఱియు యుద్ధముచేయుటకుఁ బని లేకపోయినందునఁ దన బాహువుల తీటను భరింపలేకపోయెను. అతఁడు తన శిరస్సులనెడి కమలములచేత నీ పాదకమలములను బూజించుటవలనను, నీయందలి స్థిరమైన భక్తివిశేషమువలనను, అతని కట్టి శక్తి కలిగెను గదా.

12. అ॥ ఈశ్వరపరసాక్షాత్కారమువలన రావణునికిఁ గలిగిన ఫలమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ అముష్య త్వత్సేవాసమధిగతసారం భుజవనం।
బలాత్కైలాసేఽపి త్వదధివసతౌ విక్రమయతః।అలభ్యా
పాతాళే ప్యలసచలితాంగుష్ఠశిరసి। ప్రతిష్ఠా త్వయ్యాసీ
ద్ధ్రువ ముపచితో ముహ్యతి ఖలః॥

మ॥ భవదారాధనలబ్ధబాహుమహిమన్
పౌలస్త్యుఁ డారౌర నీ। భవనంబౌ రజతాద్రి
నెత్తఁ గమకింప న్నీదు పాదాంగుళిం। ధ్రువ
సత్త్వంబున కోర్వలేక మొఱఁ బాతాళంబు
న న్నిల్వఁ డయ్యె వచింపం బనియేమి
దుష్టుఁ డిలఁ దా నిం తైన వేల్పుల్ [illegible]

పా తా ం త ర ము ॥

మ॥ నిను పౌల స్త్యుఁడు గ [illegible]
మర్థి నిండారఁగాఁ గాంచుటన్। ఘన కైలాస
ము నీ గృహం బనక నీకం దాక నీ కాలి
బొట్టనవ్రేలొత్తి కదల్చి తీవు నిలువం దా
నొందుఁ బాతాళముం। దున నైనం గనఁ
డయ్యె వాఁడు సిరిచే దుష్టుండు మేలె
న్నునే?

శా॥ ఓ దేవా! నిన్ను సేవించుటచేతఁ గలిగిన తన

భుజపరాక్రమమును నీ నివాసమయిన కైలాసపర్వతము మీఁద వినియోగపరపఁగా నీవు నీ కాలి బొట్టన వ్రేలిని రవంత దిగువకు నదిమినప్పుడా రావణుఁడు పాతాళలోకమందుఁ గూడ నిల్వలేకపోయెను. ఐశ్వర్య బలమత్తుఁడైన దుర్జనుఁడు తన యుపకారి కపకార మొనర్చుట నిశ్చయమే కదా.

13. అ॥ ఈశ్వరుఁడు బాణాసురు ననుగ్రహించుటను భక్తుఁడు స్తోత్రముచేయుచున్నాఁడు.

శ్లో॥ యదృద్ధిం సుత్రామ్ణో వరద పరమోచ్చైరపి సతీ।మధశ్చక్రే బాణః పరిజనవిధేయత్రిభువనః న తచ్చిత్రం తస్మిన్ వరివసితరి త్వచ్చరణయోః।న్న కస్యా ఉన్నత్యై భవతి శిరస స్త్వ య్యవనతిః॥

మ॥ సురనాథుం గణియింపనట్టి సిరులన్ సొంపారి లోకత్రయం। బు రహింగా బాణుసురారిగెల్చి విజయస్ఫూర్తిన్ విజృంభించె నీ। చరణాంభోరుహ యుగ్మలగ్న హృదయా

ప్రాంతైకభక్త్యున్నతిన్। వరదా! తావకసేవ
నంబు సకలైశ్వర్యప్రదంబేకదా.

పాఠాంతరము

చ॥ బాణసురారి యింద్రుని యపారమ
హావిభవంబు నెంతయున్। క్షీణముచేసి యం
త నిజసేవకపాళికి విష్టపంబులన్। ప్రాణ
నాసంగె నీదుపదతత్పరుడం దవి చిత్ర
మౌనె యో। స్థాణుడ! యెట్టియున్నతి
నాసంగదు నీకొసరించు ప్రొక్కుగిన్॥

తా॥ ఓశివా! నీ వరప్రసాదము వలన బాణాసు
రుడు మూడు లోకములను జయించి తన సేవకుల
వశముచేసి మిక్కిలి గొప్పదైన యింద్రైశ్వర్యమును తిర
స్కరించె ననునది నీ పదభక్తుడైన యీ బాణాసురుని,
యం దాశ్చర్యముకాదు. ఏలయన నీ విషయమై శిరస్సు
చేతఁ జేయఁబడెడు నమస్కారము సర్వోన్నతిని
గలుగఁజేయును గదా.

14. అ॥ కాలకూట విషమును శివుఁడు భ
క్షించుటను భక్తుఁడు స్తుతిచేయుచున్నాఁడు.

శ్లో॥ అకాండబ్రహ్మాండక్షయచకితదేవాసురకృపా।
విధేయస్యాసీద్యస్త్రినయన విషం సంహృతవతః। స
కల్మాషః కంఠే న తవ కురుతే న శ్రియ మహో। వికా
రోపి శ్లాఘ్యో భువనభయభంగవ్యసనినః॥

ఉ॥ కాలముగాని కాలమునఁ గంజభ
వాండవిపత్తుఁ జూచుటకా। దాళగలేక వేల్పు
లును దైత్యులు నిన్గనియాడ నామహా।
హాలహాలంబుఁ గ్రోలితివి యందలి నైల్యము
నీకు నందమా; । శూలి! వికారలక్షణము
స్తుత్యమెగా భువనార్తిహారికిన్॥

తా॥ మూడునేత్రములుగల యో భగవంతుఁడా!
కాలకూట విషమువలన సకలలోకప్రళయము కాల
ముండక సంభవింపఁబోవుచున్నదని దేవాసురులు

భయపడి నిన్ను శరణముపొందిరి. అప్పుడు నీవు వారి యెడలఁ గృపచేత నా కాలకూటవిషమును మ్రింగుట వలన నీకంఠమందుఁ గలిగిననలుపు శుద్ధస్ఫటికసంకాశ మైన నీ మూర్తికి శోభాకరంబే కాని వికార లక్షణము కాదు.ఒకవేళ వికారలక్షణముగ నున్నను లోకభయనివారణవలన సంభవించుటఁజేసి యదియు స్తోత్రార్హమే.

15. అ॥ కాముని నిగ్రహించుటనుగూర్చి భగవంతుని స్తోత్రముచేయుచున్నాఁడు.

శ్లో॥ అసిద్ధార్థా నైవ క్వచి దపి సదేవాసురనరే।
నివర్తంతే నిత్యం జగతి జయినో యస్య విశిఖాః।స
పశ్య న్నీశ త్వా మితరసురసాధారణ మభూత్। స్మర
స్స్మర్తవ్యాత్మా నహి వశిషు పథ్యః పరిభవః॥

చ॥ సురనరదైత్యలోకములఁ జొచ్చుచు
నేజయశాలిబాణముల్।విరహితసిద్ధి నెన్నఁడును
వెన్కకు వచ్చుట కానరాదయా। స్మరుఁ

డొకవెల్పుగా నినుఁ బ్రమత్తత నెన్ని
యనంగుఁ డయ్యెఁగా। యటుగాయ జితేంద్రియా
పకృతి యంతట నింతటఁ బోవునే శివా!॥

తా॥ సర్వలోకనివాశాలి వైన ఓయీ పరమేశ్వరుఁడా! దేవమర్త్యాసురులతోఁ గూడుకొనిన స్వర్గమర్త్యపాతాళలోకములయందు జయశాలివైన యీ మన్మథునియొక్క బాణములు వ్యర్థములై మఱలివచ్చుట లేదో యట్టిమన్మథుఁడు లోకబాంధుఁడవైన నిన్ను నితర దేవతలతో సమానునిగా నెంచుటచే నీ ఫాలనేత్రాగ్ని చేత భస్మీకృతశరీరుఁ డాయెను. కాన జితేంద్రియుల విషయమై చేయఁబడెడి యవమాన మొకనికిని సుఖకరము కాదనుట.

16. అ॥ ఈశ్వరునియొక్క తాండవమును గుఱించి స్తోత్రముచేయుచున్నాఁడు.

శ్లో॥ మహీ పాదాఘాతా ద్వ్రజతి సహసా

నీతులకు రత్నాంగద సన్నిధి.

సంశయపదం । పదం విష్ణో ర్భ్రామ్య ద్భుజపరిఘరుగ్ణ
గ్రహగణం। ముహు ర్ద్యౌ ర్దౌస్థ్యం యా త్యనిభృత
జటాతాడితతటా। జగ ద్రక్షాయై త్వం నటసి నను వామై
వ విభుతా॥

ఉ॥ ధారుణి పాదఘట్టనలఁ దత్తఱ
ముత్తలపాటుఁ జెందు వి। ష్ణ్వారభుజార్గళా
హతులఁ దారలు నుగ్గుగ నింగి తొట్రిలున్।
స్ఫారజటాభిఘాతముల స్వర్గము దుర్గతిఁ
జెందు లోకర। క్షారతి నీవు తాండవము సల్పు
చు నుండఁగ వ్యత్యయంబుగన్॥

తా॥ బలవంతుఁడైన యొకానొక రాక్షసుఁడు సంధ్యాకాలమం దీ జగత్తును క్షయింపఁజేయుటకొఱ కుద్యుక్తుఁడు కాఁగా వాని సంహారార్థమై యా కాలమం దీశ్వరా! నీవు తాండవము చేసితివి. ఆ తాండవము సర్వలోక పరిపాలనార్థమై కలిగెను. ఆ కాలమందు

భూమి శీఘ్రముగాఁ గ్రుంగిపోవుచున్నట్లు కన్పట్టెను. ఆకాశమును నీయొక్క భుజములనెడు దండవిక్షేపము లచేత భగ్నమైన నక్షత్రసమూహము కలది యాయెను. అదే ప్రకారము స్వర్గమును నష్టమైన స్థితిని జెందెను. ఓదేవా! భూమ్యాకాశస్వర్గము లట్టి స్థితిని బొంది యుండఁగా నీవు జగత్పరిపాలనమునకై నృత్యము చేసినాఁడవు. కావున నీ మాహాత్మ్యము విపరీతముగ నున్నది.

17. అ॥ పూర్వకాలమందగస్త్యమహాముని చేత సముద్రము పానము చేయఁబడఁగా శివుని జటాజూట మందున్న గంగాజలమువలన సముద్రము తిరిగి జలపూరితమయ్యె నని స్తోత్రము చేయఁబడుచున్నది.

శ్లో॥ వియద్వ్యాపీ తారాగణగుణిత ఫేనోద్గమరుచిః।
ప్రవాహో వారాం యః పృషత లఘు దృష్టః శిరసి
తే।జగ ద్ద్వీపాకారం జలధివలయం తేన కృతమి త్యనే
నైవోన్నేయం ధృతమహిమ దివ్యం తవ వపుః॥

మ॥ వియవీథిం బ్రసరించి దిక్కుగమిచేఁ
జెంపొందు ఫేనాభమై। తనరున్నీ శిరమందు
నేర్చురమునిత్యంబేక బింద్వాకృతిం। దిననా
థాయుత తేజ! తద్ధుని భువిం ద్వీపంబుగాఁ
జొచ్చెన్;।గన దీన స్వహిమోన్నతంబు గద
నీ కాయం బమేయంబుగన్॥

తా॥ భగీరథునిచేఁ బ్రార్థింపఁబడి యీ గంగాప్రవాహ మాకాశమందు వ్యాపించివచ్చునదియు, నక్షత్ర సమూహముచేత శోభింపఁ జేయఁబడిన నురుగుల యొక్క కాంతిగలదియు నై బయలుదేరివచ్చెనో యాగంగా ప్రవాహము నీయొక్క శిరస్సునందు జలబిందువువలె నగపడెను. అట్టి ప్రవాహముచేత లోకము సముద్రము యగడ్తగాఁ గలదిగాను ద్వీపస్వరూపముగాను చేయఁబడినది. అట్టి ప్రవాహము నీ జటాజూటమందు జలబిందువువలెనే సూక్ష్మముగ నగపడుటచే నీ దివ్యశరీరము మిక్కిలి మహిమగలది యని యూహింపఁదగినదిగా నున్నది.

18. అ॥ ఈశ్వరుఁడొనర్చిన త్రిపురసంహారాడంబరమును స్తోత్రముచేయుచున్నాఁడు.

శ్లో॥ రథః క్షోణీ యంతా శతధృతి రగేంద్రో ధను రథో। రథాంగే చంద్రార్కౌ రథచరణపాణి శ్శర ఇతి। దిధక్షో స్తే కో౽యం త్రిపురతృణ మాడంబరవిధి। ర్విధేయైః క్రీడన్త్యో నఖలు ఫలతంత్రాః ప్రభుధియః॥

చ॥ అరదము భూమి, యంత చతురాస్యుఁడు, చాపము మేరుధారుణీ। ధర, మిరు చక్రముల్ రవిసుధాకరు లమ్ము రమాధినాథుఁడై। పరగఁ దృణోపమత్రిపుర భంజనముం బొనరించియుంటి వౌరా। వరద! విలాస హేతుకృతవాంఛులెగాని ఫలార్థులే విభుల్॥

తా॥ ఓ యీశ్వరుఁడా! నీకుఁ దృణప్రాయులుగ నుండెడు త్రిపురాసురులను నీవు సంహారించుటకై భూరుక్మాంగద విద్యార్థులకును దెలియును.

మిని రథముగాను, బ్రహ్మదేవుని సారథిగాను, మహా మేరువును ధనస్సుగాను, చంద్ర సూర్యులను రథచక్రములుగాను, విష్ణువును బాణముగాను, నేర్పఱచుకొంటివి. కాని ప్రభువులయొక్క బుద్ధులు ఫలప్రధానములు కావు. మఱి మన నవి యెప్పటికిని భృత్యులతోఁ గూడ నాటలాడుచుండెడివి. కాన నీ యాడంబరవిధి యుక్తమే యగును.

19 అ॥ పూర్వము మహాదేవుఁడు శ్రీ హరికిఁ జక్ర మొసంగె ననెడి విషయమును స్తుతించుచున్నాఁడు.

శ్లో॥ హరి స్తే సాహస్రం కమల బలి మాధాయ పదయో । ర్యదేకోనే తస్మి న్నిజ ముదహరే న్నేత్ర కమలం । గతో భక్త్యుద్రేకః పరిణతి మసౌ చక్రవపుషా । త్రయాణాం రక్షాయై త్రిపురహర జాగర్తి జగతాం ॥

చ॥ హర! భవదంఘ్రియుగ్మమున నబ్జస హస్రబలిం బొనర్పఁగా । హరి యొకపద్మ

ముం గనక యాత్మ సరోరుహనేత్ర మర్పణం।
బురుతరభక్తిఁ జేసె నదియొప్పఁగఁ జక్రము
ప్రకాశితం। బరిణతినొంది లోకముల బాలక
రక్షణఁ జేయు నీ కృపన్॥

తా॥ ఓ పరమేశ్వరుఁడా! నీ పాదములను సహస్రదళములుగల సహస్రకమలములచేతఁ బూజించుటకు నారాయణమూర్తి సంకల్పించి భక్తితోఁ బూజ చేయుచుండఁగా ఆ దేవుని భక్త్యతిశయమును గనుగొనుటకై యొక కమలమును మఱుగుపఱచితివి. అప్పుడా విష్ణువు తాను కమలాక్షుఁడగుటచేఁ దక్కువపడిన కమలమునకు తన నేత్రకమలమును పెల్లగించి సమర్పించెను. అంతట నీవును దద్భక్తివిశేషమునకు సంతసిల్లి సర్వశత్రుభీకరమును, త్రైలోక్యపాలనసమర్థంబు నైన చక్రమును అతని కొసంగితివి.

20. అ॥ కర్తృఫలదాత యీశ్వరుఁడే యని ప్రతిపాదించుచు స్తుతి చేయుచున్నాఁడు.

శ్లో॥ క్రతౌ సుప్తే జాగ్ర త్త్వమసి ఫలయోగే క్రతుమతాం। క్వ కర్మ ప్రధ్వస్తం ఫలతి పురుషారాధన మృతే। అతస్త్వాం సంప్రేక్ష్య క్రతుషు ఫలదానప్రతిభువం। శ్రుతౌ శ్రద్ధాం బద్ధ్వా దృఢపరికరః కర్మసు జనః॥

మ॥ తలపం గర్మము జాయమాన మగు
టన్ ధ్వస్తంబు నౌ; నీవు తత్ఫలముం
గూర్తువు కర్తకున్; శివ! భవత్పాదంబులం
గొల్వమిన్। ఫలదం బెట్లగు నద్ది? కావునఁ
గ్రతుపాంచత్ఫలం బిచ్చు నిం। జెలువారన్
మది నిల్పి శ్రుత్యనుగతిం జేతుర్ నరుల్
యాగముల్॥

తా॥ పూర్వ మీమాంసకుఁ డీశ్వరునికి కర్తృత్వము లేదనియుఁ గర్మమే ఫలకర్త యనియు వ్యవహరించు చున్నాఁడు. అతని మతము నిరాకరింపఁబడుచున్నది.

---

ఎట్లనిన యాగము క్రియాత్మక మగుటచే। నుత్పత్తివినాశములు గలది యగుచున్నది.నశించిపోయిన యాగములు తత్కర్తలకు ఫలము నేవిధముగా నిచ్చును?,కాన వానికి ఫలమిచ్చువాడీశ్వరుఁడే.నశించిపోయిన కర్త యీశ్వరాధీనమై యుండును.ఈ హేతువువలన సమస్త జనులును యాగఫలప్రదాత యీశ్వరుఁడే యని విశ్వసించి వేదవాక్యములయందు శ్రద్ధ నుంచుకొని యాగాది కర్మలయందు దృఢమైన ప్రయత్నముకలవా రగుచున్నారు.

21. అ॥ పైనిశ్లోకార్థము నే దక్షయాగధ్వంస దృష్టాంతముచేత దృఢపఱుచుచున్నాఁడు.

శ్లో॥ క్రియావతాం దక్షః క్రతుపతి రధీశ స్తనుభృతా। మృషీణా మార్త్విజ్యం శరణద సదస్యా స్సురగణాః।క్రతుభ్రేషస్త్వత్తః క్రతుషు ఫలదానవ్యసనినో। ధ్రువం కర్తుః।శ్రద్ధావిధుర మభిచారాయ హిమఖాః॥

నవయుకశ్రీమే విద్యార్థి మిత్రము.

ఉ॥ దక్షుఁడు కార్యదక్షుఁడు విధాత
యధీశుఁడు ప్రాణికోటికిం గర్తను బూని దేవ
ఋషి కాండము లోలి సదస్య ఋత్విజుల్
గా క్షితిభృన్నివాస! క్రతుకార్య మొనర్పఁగ
నిన్ను వీడి; యజ్ఞ ధ్వంసమయ్యె. దుష్కృత
సుఖంబులు వ్యర్థము లౌట చిత్రమే?॥

తా॥ దక్షప్రజాపతి సకలప్రజలకనఁ బతిగా
నుండి యను, యాగాదికర్తలయందు సమర్థుఁడుగా నుండి
యను క్రతుఫలదాతయైన నిన్నునిరాకరించి తాను యాగ
ము సేయఁ బూని యాయాగమునకు వశిష్టాదిఋషులను
ఋత్విక్కులుగాను నింద్రాదిదేవతలను సదస్యులుగాను
నేర్పఱచెను, అట్టి సామగ్రి గలిగి యుండినను ఆ దక్షు
నికిఁ గ్రతుధ్వంసము క్రతుఫలదాతవైన నీవలనఁ గలిగె
ను,అది యుక్తమే.ఏల యన నో దేవా! నీ యెడల
శ్రద్ధలేని పురుషునియొక్క యాగము లన్నియు వాని
యనర్థములకే యగుచున్నవి.

22. అ॥ తనతండ్రియొక్క పాదములను నఱికిన యొక బ్రాహ్మణకుమారునికి శివుఁడు సాయుజ్య మిచ్చుటను భక్తుఁడు స్తుతించుచున్నాఁడు.

శ్లో॥ సతాం వర్త్మత్యక్త్వా శ్రుతిసమధిగమ్యాం సహాభువం। ఘృణా మప్యున్మూల్య స్వజనవిషయస్నేహ గుణితాం। ద్విజః కృంతన్పాదే పితర మపరాధ్యంత్వయి విభో। మనుష్యత్వం సద్య స్త్రిదశపరిణామేన విజహౌ॥

చ॥ పుట్టువుతోడఁ బుట్టి శ్రుతిపుంజ హితంబగు సాధుమార్గము। న్నెట్టి నిజాప్త సఖ్యద్విగుణీకృతమైనదయావిశేషము। న్నెట్టన ద్రోసి భూసురుఁడు నిగ్గికరించినతండ్రి పాద మ్మూఁట। బిట్టుగ నుత్తరించియును వేల్పుగ నయ్యెనుగాదె నీ కృపన్॥

తా॥ వేదోక్తమయినదియును సదాచారమయినది యును నగు సన్మార్గమును విడిచి స్వజన విషయమై

రెట్టింపుగాఁ జేయఁబడు పయను నిర్మూలించి నీ కపరా
ధముచేసిన తన తండ్రియొక్క పాదములను నఱికి
రొక బ్రాహ్మణ బాలుఁ డాతఁడమండె నీ యనుగ్రహము
వలన మనుష్యధర్మమును వదలి దేవత్వమునుఁ బొందెను.
ఆ యపరాధ మీమనఁగా నా ద్విజకుమారుఁ డపవిత్ర
వస్తువునందు ని ర్మాణాహించి షట్కాలపూజఁ
జేసెను.అతని తండ్రి వచ్చి యా వస్తువుఁ జూచి
"ఇట్లులచేసెద" నని క్రోధములో నా వస్తువును బాద
ములోఁ దన్నెనని పురాణగాథ యొకటికలదు.

23. అ॥ పూర్వ మొకప్పుడు బ్రహ్మదేవుఁడు
తన కొమరితతో సంగమింపవలె నని యభిలషింపఁగా
శివుఁ డాయనను నిగ్రహించె. ఆ నిగ్రహసామర్థ్యమును
భక్తుఁడు నుతించుచున్నాఁడు.

శ్లో॥ ప్రజానాథం నాథ ప్రసభ మభికం స్వాం
దుహితరం।గతం రోహిద్భూతాం రిరమయిషు మృశ్య

మనునంథ వతుముపద్దర్శనఘుండుఁజూసుకు.

స్య వపుషా।ధనుష్పాణే ర్యాతం దివమపి సపత్రాకృత
మముం।త్రసంతం తే ద్యాపి త్యజతి న మృగవ్యా
ధరభసః॥

మ॥ తనకూతుస్ మృగియైన దానిని
బలాత్కారంబుగాఁగూడ దా।నును సారంగ
మునై విధాత చన ధానుష్కుండవై సాంబ!
యా। ఘనదోష్కిఁ శరవిద్ధుఁ జేయ నతఁ
డాకాశంబుఁ బట్టెఁ భయం।బున; నీ బోయ
తనంబ దిప్పటికి నిపుఁ భీతి నద్ధాతకుఁ॥

తా॥ లేడిగానున్న తన కొమార్తెతో బలాత్కార
ముగా రమించుటకై బ్రహ్మదేవుఁడు జింకశరీరమును
ధరించి యున్న నిగ్రహించుటకై వచ్చుచున్న నీ వ్యాధ
రూపమునుఁ జూచి భయపడి యాకాశమునుఁ బొంది
యుండఁగా నో దేవా! నీ బాణముచేత నతఁడు కొట్టఁబ
డెను. ధనుస్సును హస్తమునందుఁగల నీయొక్క వ్యాధ
రభస మా బ్రహ్మ నిప్పటికిని విడువలేదు.

న్మాశనంబుగా నుండినం । బాడిందవ్వని భక్త వర్యులకు సంపద్దాత వీవే కదా.

శా॥ మన్మథవైరి ఐయిన యో యీశ్వరుఁడా! నీకు శ్మశానమే విహారస్థానము; భేతాళాదిపిశాచములే సహవాసులు; పీనుఁగుబూదియే నీకు విభూతి; నర కపాలసమూహమే నీకుఁ బూలదండ; నీ స్వభావ మంతయు నిట్లమంగళముగ నున్నను నిన్ను స్మరించు భక్తులకు నీవు సర్వోత్కృష్టశుభదాత వగుచున్నాఁడవు.

28. అ॥ శివుఁడు పరతత్త్వ మగుటను నిరూపించి స్తోత్రము చేయుచున్నాఁడు.

శ్లో॥ మనః పత్యక్చిత్తే సవిధమ విధా యాత్త మరుతః । ప్రహృష్యద్రోమాణః ప్రమదసలిలోత్సంగితదృశః । యదాలోక్యాహ్లాదం హ్రద ఇవ నిమజ్జ్యామృతమయే। దధత్యంత స్తత్త్వం కిమపి యమిన స్తత్కిల భవాన్.

ఉ. వాయువులన్ బిగింపుచు నపారము
గాఁ బులక ల్జనింపఁగాఁ । బాయక ప్రత్యగా
త్మ హృదయంబునఁ జేర్చుచు దేనిఁ జూచి
యా । ప్యాయము జెంది యోగులు ముద
శ్రులు కన్నులఁ దోఁపఁగా సుధా । తోయధి
మున్గినట్లు పరితోషితు లౌదురా యద్ది
నీవెగా.

తా॥ ఓ పరమేశ్వరుఁడా! యోగీశ్వరులు ప్రా
ణాదివాయువులను నిరోధించి పులకాంకిత శరీరులై
సాక్షిభూతమైన ప్రత్యక్ చైతన్య మందు యోగశాస్త్రో
క్త ప్రకార మంతఃకరణమును నిలిపి యేతత్త్వమును
ప్రత్యక్షముగఁ జూచి యానందబాష్పములు నేత్రముల
నుండి కాఱఁగా నమృతమయమైన సరస్సునందు మునిఁ
గిన వారివలె నుందురో యా తత్త్వము నీవేకదా!.

27 అ॥ భగవంతుని యష్టమూర్తిత్వము నుద్దే
శించి స్తోత్రము చేయుచున్నాఁడు.

శ్లో॥ త్వ మర్క స్త్వం సోమ స్త్వ మసి పవన స్త్వం హుతవహ! స్త్వ మాప స్త్వం వ్యోమ త్వము ధరణి రాత్మా త్వ మితిచ। పరిచ్ఛిన్నా మేవం త్వయి పరిణతా బిభ్రతిగిరం। నవిద్మ స్తత్తత్త్వం వయ మిహ తు యత్త్వం న భవసి,

ఉ॥ భాను, కృశాను, సోమ, మఘ జలాభ్ర, మరు, ద్ధరాత్మ లోఁ। ...ర మూర్తులుగ శోభిలు నీ కని నీదుతత్త్వవి। జ్ఞానులు వేఱుపుచ్చుచు బ్రకర్షగఁ బల్కిన బల్కునిమ్మహా!॥ యేనెటఁగాన విశ్వనిలయా కృతతత్త్వ! త్వ దన్యంబింతయున్.

తా॥ ఓ యీశ్వరుఁడా! నీవు సూర్యుఁడవు, చంద్రుఁడవు, పవనుఁడవు, అగ్నివి, ఉదకమవు, ఆకాశమవు, భూమివి, పరమాత్మవు, నగుచున్నావనియు, నీ వష్టమూర్తి వనియు నీ తత్త్వ మెఱిఁగినవారలు

విష్ణ్వగ్నిగాఁ బలుకుచున్నారు. మే మయిననో యీ లోకమందు నీవు కాని వస్తువు నెఱుంగము.

28 ఆ॥ ప్రణవమును బ్రతిపాదించి భగవంతుని స్తోత్రము చేయుచున్నాఁడు.

శ్లో॥ త్రయాం తిస్రో వృత్తీస్త్రిభువనమథో త్రీనపి సురా। నకారాద్యై ర్వర్ణై స్త్రిభి రభిదధ త్తీర్ణ వికృతీ। తురీయం తే ధామ ధ్వనిభి రవరుంధాన మణుభిః సమస్తం వ్యస్తం త్వాం శరణద గృణా త్యోమితి పదం.

మ॥ క్రమ మొప్పారఁగ నక్షరత్రయ మకారం బాదిగాఁ గల్గి వే। దములన్ వృత్తుల, మూర్తులన్ జగములం దత్సంఖ్యచేఁ బల్కు నీ। యమలంబైన తురీయధామమును సూక్ష్మారావర్ణాగ్రిమ్మని। త్యము హాళిన్నిన్ను నుతించు నోంపదము వ్యస్తంబున్ సమస్తంబునై.

శా॥ భక్తులకు శరణ మొసంగెడి దాతా దేవా!

అఖండ రూపమును వ్యస్తరూపము నై ప్రణవ మకారో కారమకారములచేత వేదత్రయమును, స్వరత్రయము ను, మూర్తి త్రయమును, బలుకుచు వికార రహితమై తురీయమైన నీ తేజోరూపస్థానమందు నతిసూక్ష్మధ్వను లచేత వ్యాపించుచున్నదై ఓమ్మనెడు ప్రణవపదము నిన్ను స్తుతించుచున్నది.

29 అ॥ శివుని నామాష్టకమును బ్రతిపాదించి నుతించుచున్నాఁడు.

శ్లో॥ భవ శ్శర్వో రుద్రః పశుపతి రథో్గ్ర స్స చ మహాం। స్తథా భీమేశానా వితి య దభిధా నాష్టకమిదం। అముష్మిన్ ప్రత్యేకం ప్రవిచరతి దేవ శ్రుతి రపి। ప్రియాయాస్మై ధామ్నే ప్రణిహితనమ స్యోఽస్మి భవతే॥

మ॥ భవశర్వా ద్యభిధాన కాష్టకము సద్భక్తిగా మహా మ్నాయముల్ శివ!తత్త త్పరి శోభితార్థము విమర్శింపం బ్రవర్తింప

వా! ట్లవు? నావల్లఁ దదర్థముం దెలియ దేవా!
కావునన్ శక్తిమై! స్తవముం జేసిరి యొ నర్తు
నీ మహిమకున్ సాష్టాంగ్రత్వగా మంబులగా.

తా॥ స్వప్రకాశుఁడవైన యోపరమేశ్వరుఁడా! భవ, రుద్ర, పశుపతి, ఉగ్ర, మహాదేవ, భీమ, ఈశాన, యనెడి నీయొక్క దివ్య నామాష్టకమం దొక్కొక్క నామమును గూర్చి వేదము స్తుతి చేయుచున్నది యనెడి హేతువువలనఁ బూర్వ శ్లోక ప్రతిపాదితమైన నీయొక్క తురీయ తేజస్సు కొఱకు నేను నమస్కరింపుచున్నాను.

30 అ॥ భగవంతుని యొక్క ప్రకట రూపత్వమును బ్రతిపాదించుచున్నాఁడు.

శ్లో॥ నమో నేదిష్ఠాయ ప్రియదవ దవిష్ఠాయ చ నమో! నమః క్షోదిష్ఠాయ స్మరహార మహిష్ఠాయ చ నమః! నమో వర్షిష్ఠాయ త్రినయన యవిష్ఠాయచ నమో!

నమ స్సర్వ స్మై తే త దివ మతి సర్వాయ చ నమః.

ఉ॥ వందన మాత్ర సన్నిహిత వర్తికి దూరతరానువర్తికిఁ। వందన మాచరింతు నణువై ఖరికి స్మరణీయ మూర్తికిన్। వందన మగ్రివృద్ధునకు భాసుర యౌవన మూర్తికిన్ సదా। వందన మాత్ర సర్వునకు వందన ముజ్ఝిత సర్వసంగికిఁ॥

తా॥ ప్రియమైన వనమందు విహరించెడి యో పరమేశ్వరుఁడా! నీవు మిక్కిలి సమీపవర్తివియు మిక్కిలి దూరమందుండెడి వాఁడవు, నగుచున్నావు. మన్మథుని సంహరించిన యో దేవా! నీవు మిక్కిలి సూక్ష్మస్వరూపివియు మహాత్స్వరూపివియు నగుచున్నావు. మూఁడు నేత్రములుగల యో పరమశివుఁడా నీవు మిక్కిలి వృద్ధుఁడవును, యౌవన వయస్సుగల వాఁడవు, నగుచున్నావు. మఱియు సర్వస్వరూపుఁడ

వును, సర్వాతీతుఁడవును, నగుచున్నావు. అట్టినీకు నా యీ నమస్కార మగుఁగాక.

31 అ॥ సాంఖ్య, పాతంజల, మతానుకూలము గా స్తోత్రము చేయుచున్నాఁడు.

శ్లో॥ బహులరజసే విశ్వోత్పత్తౌ భవాయ నమోనమో। జనసుఖకృతే సత్త్వోద్రేకే మృడాయ నమో నమః। ప్రబలతమసే తత్సంహారే హరాయనమో నమః। ప్రమహసి పదే నిస్త్రైగుణ్యే శివాయ నమో నమః.

చ॥ ఎవఁడు భవాఖ్యుఁడై జగము సృష్టి యొనర్చు రజోవిభూతిచే। నెవఁడు మృడాఖ్యుఁడై జనుల కిచ్చునొ సౌఖ్యము సత్త్వభూతిచే। నెవఁడు హరాఖ్య లోకము హరింపుచు నుండు తమోవిభూతిచే। నెవఁడు శివాఖ్యుఁడై గుణ నివృత్తిని జెందు నమింతు వానికిన్.

తా॥ ఓ శివా! రజోగుణ ప్రధానమై, జగత్కారణ భూతమైన నీ భవస్వరూపమునకును, సత్త్వగుణ ప్రధానమై సుఖహేతువై జగత్పరిపాలన మొనర్చు నీ మృడస్వరూపమునకును, తమోగుణ ప్రధానమై జగన్నాశహేతువైన నీ హరస్వరూపమునకును, మిక్కిలి తేజస్సు గలిగి గుణత్రయాతీతమైన నీయొక్క శివస్వరూపమునకును, నమస్కారము చేయుచున్నాను.

32 అ॥ ఇట్టి స్తవ మొనర్చుట వలన నిష్టసిద్ధిగలుగు నని నమ్ముచుం దనయందు నేమియుం గర్త్రుత్వాతిశయము లేదని భక్తుండు పలుకుచున్నాండు.

శ్లో॥ కృశ పరిణతి చేతః క్లేశవశ్యం క్వ చేదం। క్వ చ తవ గుణసీమోల్లంఘినీ శశ్వదృద్ధిః। ఇతి చకిత మమందీకృత్య మాం భక్తి రాధా। ద్వరద చరణయోస్తే వాక్యపుష్పోపహారం.

తా॥ చింతాధీనము, కార్శ్యభాజనము నా చిత్తం బిదేసదా। వంటంశ్లే గుణ

సీమ, మించు భవదౌన్నత్యంబు తా నెడ నం।
చెంతో చింతిల భక్తి యప్పు మదికిన్ ధృత్యు।
న్నతిం గూర్చి తా। సంతతమ న్నతిరూప
పుష్పబలి నీ యంఘ్రిద్వయింజేర్చెదన్.

తా॥ ఓ శివా! క్లేశాధీనమైన నామన స్సెక్కడ! సార్వకాలమును త్రిగుణాతీతమైన నీ మహిమ యెక్కడ! కాఁబట్టి నా మనసు నీ మహిమ నెట్లు తలఁపఁగలదు? ఆ కారణముచే నీ మహిమను వర్ణించుటకు భీతుఁడనైన నన్ను నీ చరణభక్తి భయరహితునిగాఁ జేసి నా స్తుతివాక్య పుష్పముల కానుకను నీ పాదయుగళమం దుంచెను.

33 అ॥ శివుని మహిమ యపారమని స్తుతించుచున్నాఁడు.

శ్లో॥ అసితగిరిసమం స్యాత్ కజ్జలం సింధు పాత్రే । సురతరు వరశాఖా లేఖనీ పత్ర ముర్వీ । లిఖతి

గానపానము నిక్కమగు గానపారమే.

యద గృహీత్వా శారదా సార్వకాలం । తదపి తవ గుణానా మీశ పారం న యాతి.

ఉ॥ నీలధరంబెకజ్జలము, నీరధి పాత్రము,
భాస్వరస్మరు। త్సాలనుశాఖ లేఖని, రసాస్థలి
పత్రముగా గ్రహించి బ్రా। హ్మీలలితాం
గియు న్భవ దమేయగుణావళి సార్వకాల
ముం। బోలఁగ వ్రాసి పారమును బొందఁగ
నేర్చున నేర్పు పెంపునన్?.

తా॥ ఓ పరమేశ్వరుఁడా! సముద్ర మనెడి పాత్రియందుఁ గాటుక కొండతో సమమైన కాటుక యుండినను, కల్ప వృక్షశాఖవంటి కలముండినను, భూమి కాగితముగనుండినను, సరస్వతీ దేవి లేఖరిగా నుండి సార్వకాలమును దానే వ్రాసినను, ఆ వాణియు నపారమహిమలుగల నీ కళ్యాణాది సద్గుణముల యొక్క తుదను బొందనేరదు.

మనుసంభవము బి. యే. తరగతిపరీక్షగ్రంథము.

34 అ॥ శివునకు నమస్కరించుట వలని ఫలిత
ము వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ వపుః ప్రాదుర్భావా దనుమిత మిదం జన్మని పురా। పురారే న క్వాపి క్షణ మపి భవంతం ప్రణత వాన్। నమన్ముక్త స్సంప్ర త్యహ మతను రగ్రే ప్యనతిమా। న్మహేశ క్షంతవ్యం తదిద మపరాధ ద్వయమపి.

ఉ॥ ఈ తనువెత్తుటం దెలిసె నేనొకసా
రియుఁ బ్రాగ్భవంబునం। జేతులు మోడ్చి
నీకు నతిఁ జేయమి, యిప్పుడు మొక్కుచుంట
నే। నీతనువెత్తఁ బోదు నతి యెట్టులు చేయు
దు మూర్తిఁ జెంది, యీ। రీతిగ నందులోప
ములు రెంటిని నీవె క్షమింపఁగావలెన్.

**తా॥ శివా! ఈ తను వెత్తుటవలన బూర్వజన్మ
మం దొకప్పుడైన నీకు నమస్కరింప లేదని తెలిసికొం**

టిని. ఇప్పుడు నమస్కరించుట వలన ముక్తిని జెం
దుదును గాన మరల జన్మలేని వాఁడనై నీకు నమ
స్కరింపఁ బోను. ఈ యపరాధద్వయమును క్షమింప
వేఁడుచున్నాను.

---

సాకల్యార్థము బేతపూడి వరవంశప్రోద్భ
వుండైన ల। క్ష్మీకాంతుం డిటు పుష్పదంత
రచితామేయస్తవం బాంధ్ర భా। షాకృత్యం
చితపద్యముల్ ఘనరిచెన్ సద్భక్తుఁడై,
యీస్తవం। బాకాంక్షం బఠియించువార
లకు శ్రేయం బా శివుం డిచ్చెడున్.

శ్రీ
సాంబశివార్పణమస్తు.

---

# ప్రకటన.

1. రుక్మాంగద.(డ్రామా.) ఇది నూతనపద్ధతుల నవలంబించి పూర్వాపూర్వ నాగరిక సమ్మతంబుగ వ్రాయఁబడినది. ఇది స్త్రీలకు పరమగురువు. నవ్వులకు పెన్నిధి. నీతులకు పుట్టినిల్లు. స్త్రీలకును విద్యార్థులకును గూడ సులభముగ దెలియును. వెల రు 1-0-0

2. మనుసంభవము (డ్రామా.) ఇది బి. యే. తరగతి పరీక్ష గ్రంథము. ఇది స్వారోచిషమనువు యొక్క జన్మవృత్తాంతము. అల్లసాని పెద్దన కవిగారి యసమాన మాధురీ భరితమైన మృదుశైలిగల పద్యములు పెక్కులిందుఁ జేర్పబడినవి. ఇది పరిదర్శన మందు సర్వజన రంజకముగ నుండును. దీనిని జదువు వారలు సుఖ పరవశులగుచుందురు. దీనిని ప్రదర్శన మందు చూచి తీరవలయును. వెల రు. 1-0-0

కేతపూడి భగవంతరావు, మచిలీపట్టణము.

